# హనుమాన్ చాలీసా

ME BLOCKS

శ్రీ రామ

శ్రీ హనుమతేనమః

# హనుమాన్ చాలీసా

శ్రీగోస్వామి తులసీదాసు



కాపీలెఫ్ట్]  1979  [వెల:అమూల్యము

# శ్రీ ఆంజనేయ దండకము

శ్లో ॥ ఆంజనేయం మహావీరం బ్రహ్మ విష్ణు శివాత్మకం ।
తరుణార్క ప్రభోశాన్తం రామదూతం నమామ్యహం ॥

శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం ప్రభాదివ్యకాయం ప్రకీర్తిప్రదాయం భజేవాయుపుత్రం భజేవాలగాత్రం భజేహం పవిత్రం భజేసూర్యమిత్రం భజేరుద్రరూపం భజేబ్రహ్మతేజం బటంచున్ ప్రభాతంబు సాయంత్రమున్ నీ నామ సంకీర్తనల్ జేసి నీ రూపు వర్ణించి నీ మీద నే దండకం బొక్కటింజేయునూహించి నీ మూర్తి గావించి నీ సుందరంబెంచి నీ దాసదాసుండనై రామ భక్తుండనై నిన్ను నే గొల్చెదన్ నీ కటాక్షంబునన్ జూచితే వేడుకల్ జేసితే నామొరాలించితే నన్నురక్షించితే అంజనాదేవి గర్భాన్వయా దేవ నిన్నెంచ నేనెంతవాడన్ దయాశాలివై జూచియున్ నన్ దాతవై బ్రోచియున్ దగ్గరన్ బిల్చియున్ సుగ్రీవుకున్మంత్రివై స్వామి కార్యార్థమై యేగి శ్రీరామ సౌమిత్రులుంజూచి వారిన్ విచారించి సర్వేశు బూచించి యబ్బానుజున్ బంటు గావించి యవ్వాలినిం జంపి కాకుత్థ్సతిలకున్ కృపాదృష్టి వీక్షించి కిష్కింధకేతెంచి శ్రీరామకార్యార్థమై లంకకేతెంచి యా లంకిణిన్ జంపి, యా లంకనున్ గాల్చి యా భూమిజం జూచి



యానందముప్పొంగ యా యుంగరంబిచ్చి యా రత్నమున్ దెచ్చి శ్రీరాముకున్నిచ్చి సంతోషముంజేసి సుగ్రీవుని న్నంగదున్ జాంబవంతున్ న్నలునీలునిం గూడి యాదైత్యులం ద్రుంచగా రావణుండంత కాలాగ్ని రుద్రుండుగా వచ్చి బ్రహ్మాండమైనట్టి యా శక్తినిన్ వైచి యా లక్ష్మణున్ మూర్ఛనొందింపగా నప్పుడే నీవు సంజీవినిందెచ్చి సౌమిత్రికిన్నిచ్చి ప్రాణంబు రక్షింపగా కుంభకర్ణాదులు న్వీరులుం బోర శ్రీరామ బాణాగ్ని వారందురున్ రావణున్ జంపగా నంత లోకంబులానందమైయుండ నవ్వేళనున్ విభీషణున్ వేడుకన్ దోడుకన్ వచ్చి పట్టాభిషేకంబు చేయించి సీతామహాదేవినిన్ దెచ్చి శ్రీరాముకున్నిచ్చి నంత న్నయోధ్యాపురంబునన్గొచ్చి పట్టాభిషేకంబు సంరంభమైయున్న నీకన్న నాకెవ్వరున్ గూర్మిలేరంచు మన్నించి శ్రీరామభక్త ప్రశస్తంబుగా నిన్ను సేవించి నీ కీర్తనల్ చేసినన్ బాపముల్బాయవే భయములున్ దీరవే భాగ్యముల్ గల్గవే సామ్రాజ్యముల్ గల్గు సంపత్తులున్ గల్గునో వానరాకార యోభక్తమందార యోపుణ్యసంచార యోధీర యోవీర నీవే సమస్తంబుగా నొప్పి యా తారకబ్రహ్మ మంత్రంబు పఠించుచున్ స్థిరముగన్ వజ్రదేహంబునున్ దాల్చి నీ ధీరదేహంబు నా జిహ్వనుందాల్తు త్రైలోక్య సంచారివై

రామ నామాంకితధ్యానివై బ్రహ్మతేజంబునన్ వెల్గొందువో రౌద్ర నీజ్వాల కల్లోల హావీర హనుమంత యోంకారశబ్దంబులుం భూతప్రేతంబులున్ బెన్ పిశాచంబులున్ శాకినీ ఢాకినీత్యాదులన్ నీదు వాలంబునన్ జుట్టి నేలం బడంగొట్టి నీ ముష్టిఘాతంబులన్ బాహుదండంబులన్ రోమఖండంబులన్ ద్రుంచి కాలాగ్ని రుద్రుండవై నీవు బ్రహ్మ ప్రభాభాసితంబైన నీదివ్యతేజంబునుం జూచి రారోరి నా మద్దు నారసింహాయంచున్ దయాదృష్టి వీక్షించి నన్నేలు నాస్వామి యాంజనేయా నమస్తే సదా బ్రహ్మచారీ ప్రతాపుర్ణహారీ నమస్తే నమో వాయుపుత్రా నమస్తే నమః.

## శ్రీతులసీ గోస్వామివారు హనుమన్మహిమ గురించి యిట్లు చెప్పిరి

శ్లో ॥ మంజుల మంగళ మోదమయ మూరితి మారుతి పూత
సకలసిద్ధి కరకమల తల సుమిరత రఘువర దూత ॥

తా॥ మారుతాత్మజుని మంజుల మంగళ స్వరూపము ఆనందమయము రఘువరదూతయగు హనుమానుని స్మరించినచో సకల సిద్ధులును కరతలగతములగును.



శ్లో ॥ ధీరవీర రఘువీర పియతిమీర సమీర కుమార ।
ఆగమ సుగమ సబ కాజుకరు కారతల సిద్ధి విచార ॥

తా॥ ధీరుడగు రఘువీరునకు ప్రియుండగు పవన కుమారుని స్మరించినచో దుర్లభకార్యములన్నియు సుగమములగును సిద్ధి కరతలామలక మగును.

శ్లో ॥ సుఖమున మంగళమున సుగుణ సరోరుహోభాను ।
కరహు కాజ సబాసిద్ధిసుభ అవిహియే హనుమాన్ ॥

తా॥ సుఖమునకు, మోదమునకు మంగళములకు కలువలకు జంద్రునివంటి వాడును, సుగుణములకు కమలములకు సూర్యునివంటివాడును నగు హనుమంతుడు హృదయములోనికి వచ్చెనా సమస్త కార్యములును సుఖాంతములుగ సిద్ధింపజేయను.

శ్లో ॥ సకల కాజ శుభ సమవు ఫలసగుణ సుమంగళ జానుః ।
కీరితి విజయవిభూతి భలిహియ హనుమానహి ఆనుః ॥

తా॥ హృదయములోనికి హనుమానుడు వచ్చెనా, సమస్తకార్యములును శుభములగును, ఫలవంతములగును. మంగళ శకునములు కలుగును. మంచి కీర్తి, విజయము, విభూతి కలుగును.

శ్లో ॥ శూర శిరోమణి సాహస సుమతి సమీర కుమార ।
సురమిత సబ సుఖసంపదాముద మంగళావతార ॥

తా॥ పవనకుమారుడు శూర శిరోమణి సాహసి, సుమతి. ఆయనను స్మరించినవారికి సమస్త సుఖసంపదలును ఆనందమును శుభమును ఒసంగును.

ప్రస్తుతమీ చిన్న పొత్తమును శ్రీ గోస్వామి తులసీదాసు స్వామివారు రచించిన "హనుమాన్ చాలీసా" ఆంధ్రానువాదముతో ప్రకటించుచున్నాము. దీనిని భక్తులాదరించి తగిన ప్రయోజనమును బొందవలయునని మా ముఖ్యమగు ఆశయము. శ్రీ రామ శరణమ్.

## పారాయణము

హనుమాన్ చాలీసా పారాయణము సుందరకాండ పారాయణముతో సమానము.

దినమునకు 10 పర్యాయముల చొప్పున మండలము 40 రోజులు పారాయణము చేసిన సర్వకార్య సిద్ధి యగును. ఒకే ఆసనమున కూర్చుని 108 పర్యాయములు పఠించిన విశేష కార్యసిద్ధియగును.

నిత్యమూ మూడువేళల ఒక పర్యాయమైనను పఠించిన వారి యోగక్షేమములు భక్త రక్షకుండగు హనుమానుడే తాను స్వయముగ చూచుకొనును.



## ప్రార్థన

అతులిత బలధామం
స్వర్ణ శైలాభ దేహం ।
దనుజ వన కృశానుం
జ్ఞానినా మగ్రగణ్యమ్ ॥
సకల గుణ నిదానం
వానరాణా మధీశం ।
రఘుపతి ప్రియభక్తం
వాతజాతం నమామి ॥

గోష్పదీకృత వారాశిం,
మశకీకృత రాక్షసమ్ ।
రామాయణ మహామాలా
రత్నం వందేఽనిలాత్మజమ్ ॥

యత్ర యత్ర రఘునాథ కీర్తనమ్ ।
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్ ॥
భాష్పవారి పరిపూర్ణ లోచనమ్ ।
మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥

శ్రీ రామ హనుమతేనమః

# హనుమాన్ చాలీసా

శ్రీ గురు చరణ సరోజ రజ
నిజమన ముకుర సుధారి ।
వరణౌ రఘువర విమలయశ
జో దాయక ఫలచారి ॥
బుద్ధిహీన తనుజానీకై
సుమిరౌ పవన కుమార ।
బల బుద్ధి విద్యా దేహు మోహి
హరహు కలేశ వికార ॥

## తాత్పర్యము

దోహా : శ్రీ గురుచరణ కమలములోని రజస్సుచే నా మనస్సనే అద్దమును శుభ్రము చేసుకుని ధర్మార్ధ కామ మోక్షములను చతుర్విధ పురుషార్ధములనొసంగు శ్రీ రామచంద్రుని విమల కీర్తిని వర్ణించెదను.

ఈ శరీరము బుద్ధి హీనతచే గలిగినదని తెలిసికొని పవన కుమారుని స్మరించెదను. ఆతను నాకు బలమును, బుద్ధిని, ఒసంగుటయే గాక కామాది వికారముల వలన గలిగిన క్లేశములను హరించుగాక.







## చౌపాయి

1. జయ హనుమాన జ్ఞాన గుణ సాగర
   జయ కపీశ తిహు లోక ఉజాగర

2. రామదూత అతులిత బలధామా
   అంజని పుత్ర పవనసుత నామా

3. మహావీర విక్రమ బజరంగీ
   కుమతి నివార సుమతి కే సంగీ

4. కంచన వరణ విరాజ సువేశా
   కానన కుండల కుంచిత కేశా





1. తా. జ్ఞానగుణ సాగరుడవైన ఓ హనుమంతా! నీకు జయమగు గాక! త్రిలోకములను ప్రకాశింపజేయు ఓ కపీశా నీకు జయమగుగాక!

2. తా. రామదూతా! సాటిలేని బలమునకు ఆటపట్టయినవాడా! అంజనీసుతా! పవనసుతుండను పేరుగల వాడా!

3. తా. మహావీరా! విక్రమ స్వరూపా! వజ్రమువంటి శరీరము కలవాడా! చెడ్డబుద్ధిని బోగొట్టువాడా! మంచి బుద్ధిగలవారికి తోడ్పడువాడా!

4. తా. బంగారమువంటి శరీరచ్ఛాయ గలవాడా! మంచివేషముతో నొప్పెడువాడా! కర్ణములకు కుండలములు ధరించినవాడా! జుట్టు ముడి వైచుకొనినవాడా!



5. హాథవజ్ర అరు ధ్వజా విరాజై
కాంథే మూంజ జనేవూ సాజై

6. శంకర సువన కేసరీ నందన
తేజ ప్రతాప మహాజగ వందన

7. విద్యావాన్ గుణీ అతి చాతుర
రామ కాజ కరివే కో ఆతుర

8. ప్రభు చరిత్ర సునివే కో రసియా
రామలఖన సీతా మన బసియా





5. తా. చేతిలో వజ్రమును ధ్వజమును గల్గి విరాజిల్లువాడా! స్కంధమునందు ముంజను, జందెమును గల్గినవాడా!

6. తా. శంకరునకు పుత్రుడా! (శివ వీర్యమున బుట్టినవాడు) కేసరి (అంజనకు భర్త) తనయా! గొప్ప తేజః ప్రతాపములు గలవాడా! సమస్తజగములచే నమస్కరింప బడువాడా!

7. తా. విద్యాంసుడా! కల్యాణ గుణములు కల వాడా! మిక్కిలి చతురత్వము కలవాడా, రామ కార్యమును నెరవేర్చుటకు ఆతురత పడువాడా!

8. తా. శ్రీరామప్రభు చరితమును విను రసికులగు సీతారామ లక్ష్మణులను మనస్సున ధరించినవాడా!



9. సూక్ష్మ రూపధరి సియహి దిఖావా
వికట రూపధరి లంక జరావా

10. భీమ రూపధరి అసుర సంహారే
రామచంద్ర కే కాజ సంవారే

11. లాయ సంజీవన లఖన జియాయే
శ్రీ రఘువీర హరషి ఉరలాయే

12. రఘుపతి కీన్హీ బహుత బడాయీ
కహా భరత సమ తుమ ప్రియ భాయీ





9. తా. సూక్ష్మరూపము ధరించి, సీతకు గానబడితివి. వికటరూపమును ధరించి లంకను కాల్చితివి.

10. తా. భయంకర రూపమును ధరించి, అసురులను సంహరించితివి, రామకార్యమును నెరవేర్చితివి.

11. తా. సంజీవిని దీసుకొనివచ్చి లక్ష్మణుని బ్రతికించితివి. దానికి శ్రీరాముడు సంతసించి హృదయమున హత్తుకొనెను.

12. తా. శ్రీరామచంద్రమూర్తి నిన్ను గొప్పగా బొగిడి –"సోదరా! నీవు నాకు భరతునితో సమానమయినవాడ" వని పలికెను.



13. సహస్ర వదన తుమ్హారో యశగావై
అస కహి శ్రీపతి కంఠ లగావై

14. సనకాది బ్రహ్మాది మునీశా
నారద శారద సహిత అహీశా

15. యమ కుబేర దిగపాల జహాఁతే
కవి కోవిద కహి సకై కహాఁతే

16. తుమ ఉపకార సుగ్రీవ హి కిన్హా
రామ మిలాయ రాజపద దీన్హా





13. తా. వేయి నోళ్ళ నీ యశమును గానమును చేసి శ్రీరాముడు నిన్ను కౌగలించుకొనెను.

14. తా. సనకాది దేవర్షులు, బ్రహ్మాది దేవతులు, మునీశ్వరులు, నారదుడు, సరస్వతి, ఆదిశేషువు,

15. తా. యమ కుబేరాది దిక్పాలకులు, కవులు, పండితులు మొదలైనవారు నీ యశోగానమును ప్రీతితో చేయగలుగుదురు.

16. తా. నీవు సుగ్రీవునకు ఉపకార మొనర్చితివి. రామునితో నాతనికి సఖ్యము కావింపజేసి రాజ్య సంపద నిప్పించితివి.



17. తుమ్హారో మంత్ర విభీషణ మానా
లంకేశ్వర భయే సబ జగ జానా

18. యుగ సహస్ర యోజన పర భానూ
లీల్యో తాహి మధుర ఫల జానూ

19. ప్రభు ముద్రికా మేలి ముఖ మాహీ
జలధి లాంఘి గయే అచరజ నాహీ

20. దురమ కాజ జగత కే జేతే
సుగమ అనుగ్రహ తుమ్హారే తేతే





17. తా. నీ ఆలోచనలు విభీషణు డంగీకరించి లంకకు రాజయిన సంగతి లోకమంతకును తెలిసినదియే.

18. తా. రెండువేల ఆమడల దూరముననున్న సూర్యుని మధుర ఫలముగా భావించి లీలగా గ్రహించితివి.

19. తా. శ్రీ రామ ముద్రికను నోట నుంచుకొని సముద్రము దాటితివనుటలో నాశ్చర్యమేమున్నది?

20. తా. జగమునందు కష్టమగు కార్యమేది కలదో అది నీ అనుగ్రహమున సుగమము కాగలదు.



21. రామ దుఆరే తుమ రఖవారే
హోత న ఆజ్ఞా బిను పైఠారే

22. సబ సుఖ లహై తుమ్హారీ శరణా
తుమ రక్షక కాహూ కో డరనా

23. ఆపన తేజ సమ్హారో ఆపై
తీనోం లోక హాంక తే కాంపై

24. భూత పిశాచ నికట నహి ఆవై
మహావీర జప నామ సునావై





21. తా. నీవు రామద్వారమును గాచువాడవు. నీ యాజ్ఞ లేక లోనికి వెళ్ళుటకు వీలు లేదు.

22. తా. నిన్ను శరణు వేడిన సమస్త సుఖములును లభించగలవు. నీవు రక్షకుడవుగా నుండగా నెవరికినీ భయ పడవలసిన పని లేదు.

23. తా. నీ తేజమును సంభాళించుకొనువాడవు నీవే. ఒక్క కేక వేసిన మూడు లోకాలు వణకగలవు.

24. తా. మహావీరా! నీ నామమును విన్నచో భూత ప్రేత పిశాచములు దగ్గరకు రాజాలవు.



25. నాసై రోగ హరై సబ పీరా
జపత నిరంతర హనుమత వీరా

26. సంకట సే హనుమాన ఛుడావై
మన క్రమ వచన ధ్యాన జో లావై

27. సబ పర రామ తపస్వీ రాజా
తినకే కాజ సకల తుమ సాజా

28. ఔర మనోరథ జో కోయి లావై
తాసు అమిత జీవన ఫల పావై





25. తా. నిరంతరము వీర హనుమానుని జపించినచో సమస్త రోగములు, సమస్త పీడలు తొలగును.

26. తా. మనోవాక్కాయములచే నెవడు హనుమంతుని ధ్యానించునో, వానినతడు సమస్త సంకటముల నుండి బయట పడవేయును.

27. తా. రాముడు రాజులందరికి మకుటం వంటి వాడు, తాపసులందరకు ప్రభువువంటి వాడు. ఆయన కార్యములన్నిటిని నీవు చక్కగా సవరించుచుందువు.

28. తా. ఎవరేయే మనోరథము గలిగియున్నను వారికి జీవన ఫలిత మమితముగా లభించును.



29. చారో యుగ పరతాప తుమ్హారా
హై పరసిద్ధి జగత ఉజియారా

30. సాధు సంత కే తుమ రఖవారే
అసుర నికందన రామ దులారే

31. అష్టసిద్ధి నవ నిధి కే దాతా
అస వర దీన జానకీ మాతా

32. రామ రసాయన తుమ్హారే పాసా
సదా రహో రఘుపతి కే దాసా





29. తా. నీ ప్రతాపము నాలుగు యుగములలోను గలదనుట ప్రసిద్ధము, దానిచే జగత్తు ఉజ్వలమైనది.

30. తా. సాధుసజ్జనులను నీవు రక్షించుచుందువు, అసురులను జంపి రాజునకు ప్రియుడవైతివి.

31. తా. అష్టసిద్ధులును నవనిధుల నొసంగువాడవను వరము నీకు జానకీదేవి యొసంగెను.

32. తా. రామరసాయనము నీ వద్ద గలదు. నీవు రామచంద్రునకు శ్రద్ధాళువైన దాసుడవు.



33. తుమ్హారే భజన రామకో పావై
జన్మ జన్మ కే దుఖ బిసరావై

34. అంత కాల రఘుపతి పురజాయీ
జహాఁ జన్మ హరిభక్త కహాయీ

35. ఔర దేవతా చింతన ధరయీ
హనుమత సేయి సర్వ సుఖ కరయీ

36. సంకట హటై మిటై సబ పీరా
జో సుమిరై హనుమత బల వీరా





32. తా. నిన్ను (మేము) భజించుచున్న రామచంద్రుని కానందదాయకం, జన్మజన్మాంతర దుఃఖములను నశింపజేయును.

33. తా. ఎచ్చట జన్మించిననూ హరిభక్తులని పిలవబడుదురు. శ్రీరాముని పురమునకు అంత్యకాలమున బోవుదురు.

34. తా. ఇంకొక దేవతను చిత్తమున ధరింపక హనుమంతుని సేవించిన సర్వ సుఖములను నాతడొనగూర్చును.

35. తా. బలవీరుడగు హనుమంతుని స్మరించిన సంకటములన్నియు తొలగును. పీడలన్నియు నశించును. కష్టములను పోగొట్టువాడవు, మంగళ స్వరూపుడవు అగు పవన పుత్రుడా! సీతారామ లక్ష్మణ సహితుడవయి సమస్త దేవతలతో నీవు నా హృదయమున నుండుము.



37. జై జై జై హనుమాన్ గోసాయీ
కృపా కరో గురుదేవ కీ నాయీ

38. జో శత వార పాఠ కర కోయీ
ఛూటహి బంది మహా సుఖ హోయీ

39. జో యహ పఢై హనుమాన చాలీసా
హోయ సిద్ధి సాఖీ గౌరీశా

40. తులసీదాస సదా హరి చేరా
కీజై నాథ హృదయ మహ డేరా





37. తా. హనుమత్ప్రభువునకు జేజేలు! శ్రీ గురుదేవుని వలె గృపచూడుము.

38. తా. దీనిని నూరుసార్లు ఎవరు పఠనము చేయుదురో వారికి బంధములు వీడి సుఖములు కలుగును.

39. తా. హనుమాన్ చాలీసాయను నీ స్తోత్రము నెవరు పఠించెదరో; పార్వతీపరమేశ్వరుల సాక్షిగా సిద్ధి కలుగును.

40. తా. తులసీదాసు ఎల్లప్పుడూ హరిదాసే ఓ నాథా! నీవు నా హృదయమున నుండుము.



దోహా:–

పవన తనయ సంకట హరణ
మంగళ మూరతి రూప
రామ లఖన సీతా సహిత
హృదయ బసహు సురభూప్

–తులసీదాసు

హనుమాన్ చాలీసా సంపూర్ణము.



## ○ హనుమాన్ జీ కి హారతి ○

1. ఆరతి కీ జై హనుమాన్ లాలాకి
   దుష్టదమన రఘునాథ కలాకి
2. జాకే బలసే గిరివార కాంపై
   రోగదోష జాకే నికట నఝాంపై
3. అంజనిపుత్ర  మహాబలదాయీ
   నందనకే ప్రభు సదా సహాయీ
4. దే వీరా రఘునాథ వరాయే
   లంకా జారీ సీయ సుధిలాయె
5. లంకా సోకోట సముద్ర సీ ఖాయీ
   జాత పవనసుత బారన నాయీ
6. లంకా జారీ అసుర సంహారే
   సియా రామజీకే  కాజ సహారే
7. లక్ష్మణ మూర్ఛిత పదే సకారే
   అనిసంజీవన ప్రాణ ఉఖారే
8. పైఠిపతాల తోరి జమి కారే
   అహి రావణకీ భుజా ఉఖారే

9. బాయే భుజా అసురదల మారే
దహినే  భుజా సంత జనతారే

10. సురవరముని ఆరతీ ఉతారే
జై జై జై హనుమాన్ ఉచారే

11. కంచనదాత కపూర లౌఛాయీూ
అలతి కరత అంజనా మాయీూ

12. జో హనుమానజీకీ ఆరతి గావై
బసి వైకుంఠ పరమపద పావై

--★--







జయంతి అండ్ కొ.
శ్రీ ప్రింటర్స్, తణుకు,
ప.గో.జిల్లా, ఆం.ప్ర.

